## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ [illegible] గ్రంథమాల.
అనుబంధము 9.

చెలికాని లచ్చారావుగారు,
సంపాదకుఁడు.



# బద్దినీతులు.

(నీతిసారముక్తావళి.)

రాజ, సేవక, లోకనీతులు.

## బద్దిభూపాలుఁడు.

మొదటికూర్పు 500.

పిఠాపురము

శ్రీవిద్వజ్జనమనోరంజనీముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

1917.

# పీఠిక.

ఈగ్రంథము బద్దెన్నయను పూర్వకవి వ్రాసియున్నాఁడు. ఈకవి నకుఁ బూర్వుఁడని చరిత్రజ్ఞులయభిప్రాయము. ఈతఁ డారువేలనాఁటికిఁ త్వము చేసిన బద్దెభూపాలుఁడని విజ్ఞులు తలంచుచున్నారు.

ఈతని కవితారీతియు, భావసంపదయు, భాషాసౌకుమార్యమును జదివి కులు సంతసింపవలసినదే. ఈతఁడే సుమతిశతకమును వ్రాసినవాఁడని కానొకరనుచున్నారు. ఇదివఱ కీగ్రంథము చాల పాఠభేదములతోఁ పోయిన ప్రతియొకటి ముద్రింపఁబడినది కాన్పించుచున్నది. అందుఁ బ్ర భాగము లేదు. ఇంతయుత్తమగ్రంథ మట్లుండుట కిష్టములేక యీప్రతి ంచితిమి.

ఈగ్రంథము మాకుఁ జిక్కినప్పటికే ప్రథమాధికారము లేదు. ఇది సర్వ వస్థానమునఁగల వైష్ణవులయింటిలో దొరకిన ప్రాచీనప్రతి ననుసరించి ంచితిమి.

ఈపాఠము సవరించుటలో సాయపడిన (1) పానుగంటి లక్ష్మీనరసింహ వుపంతులుగారు (2) కూచి నరసింహముపంతులుగారు (3) పురాణపండ ల్లయ్యశాస్త్రిగారు (4) ఓలేటి పార్వతీశముగారు మానిలయమువారికృతజ్ఞ నఁ బాత్రులు.

రెండవముద్రణముతో విపులమైనపీఠిక వ్రాయింపఁదలఁచి, యింతతో మించుచున్నాము. పూరణభాగములు కుండలీకరించితిమి. పుటక్రింద న్న యక్షరములతో మాతృకయందున్నమాట లున్నవియున్నట్లు వేసితిమి. ద్ధిమంతులు కవిహృదయమును సమీపింప సాయపడఁగలవని యట్లొనర్చితిమి. ల్లే యముద్రితగ్రంథము లేవైన పంపిన ముద్రించి వారికి గ్రంథోపయోగము బట్టి కొన్నిప్రతు లొసంగుచుందుము.

చెలికాని లచ్చారావు,

సంపాదకుఁడు.




అవిఘ్నమస్తు.

శుభమస్తు.

# బద్దినీతులు.



## రాజనీతిప్రకరణము.



శ్రీరామారమణీయు న
మారామారమణు వాగ్రమాహృదయేశున్
గౌరి మురారిం బురారి న
ఘారి హృషీకేశు నీశు నజుం గొల్తు మదిన్. 1

క. రాజవరమకుటమణిగణ
పూజితపదయుగుఁడ హేమభూభృద్ధైర్య
భ్రాజితుఁడ బద్దనాఖ్యుఁడ
రాజోచితనీతు లొప్ప రచియింతుఁ దగన్. 2

చ. నయమునఁ గాని భూమిప్రజ నమ్మదు, నమ్మినఁ గాని యర్థసం
చయమును దంత్రవృద్ధియును సాగదు, సాగినఁగాని శత్రులన్
బయికొని యోర్వరాదు, రిపుపక్షమణంగినఁ గాని భూమియ
క్షయముగ నేలరా దనిరి కార్యచతుర్ముఖ బద్దిభూపతీ! 3

క. న్యాయము ప్రజపెక్కువకు ను
పాయము, ప్రజకల్మి సిరి కుపాయం బగుటన్
న్యాయమె భండారము నర
నాయకులకు నండ్రు కీర్తినారాయణుఁడా! 4

క. మేదిని కనురాగము సం
పాదించి కృతార్థుఁ డైనపతికిని విషయా
స్వాదన భూషణ మగునప
వాదము పెరపతి కుదారవైలోచనుఁడా! 5

క. పత్ని ధరిత్రియ పురుషులె
రత్నము లెపుడును; పురంధ్రిరత్నములు శిరో
రత్నము లవనీపతులకుఁ
బత్నులె? రత్నములె? పరగ బద్దనరేంద్రా! 6

క. ప్రజఁ దల్లి వెంచువిధమునఁ
బ్రజలం బతి వెంచు నదియె, పదపడి తల్లిన్
బ్రజప్రోపు సందియము, పతి
ప్రజప్రో పది నిక్కువంబు బద్దినరేంద్రా! 7

క. నమ్మ ప్రజ మూఁగు బొంకమి
నమ్మికకును సాక్షి గాఁగ నరపతి దనవా
కిమ్మయి నడపుచు లోకము
నమ్మింపఁగవలయుఁ గీర్తినారాయణుఁడా! 8

చ. గనులు కృషిప్రపంచ మరికప్పము సుంకము గోకులంబు నం
దనవనమున్ జలస్థలపథిస్థవణిక్క్రియ దుర్గరక్షణం
బనఁగలయిన్నిమార్గముల నర్థము రోయక కేవలంబ కా
పున పాలియించు రాజుసిరిపొందునె? రాజమనోజభూభుజా! 9

క. జనపతి తనప్రజభారము
తనముఖమున నడపికొనక తక్కినఁ బాలియం
డిని చెఱుపు రతనియిల్లును
జనువారును బ్రజ నరేంద్రచతురాననుఁడా. 10

క. అనుజులు తనుజులు గురుజను
లనుఁగులు బంధులు ప్రధాను లని సిరిపాత్రీఁ
జనుఁగాని యాజ్ఞపాత్రీఁ
జన దధిపతికిన్ వివేకచతురాననుఁడా! 11

క. సకలవ్యసనికిఁ జుట్టము
నకు మంత్రికి నిష్టభృత్యునకు నజ్ఞకు నో
జ్ఞకు బోటుకానికర్థా
ధికమిచ్చుట చనదు నయగతిన్ బద్దినృపా! 12

క. సాధింపఁ గడిది శత్రుల
సాధించినఁ బతికి వృథ, నిజక్షితి జనులన్
బాధించుకంటకులఁ బరి
శోధింపనినాఁడు నన్నచోడనరేంద్రా! 13

క. క్షితిజనులకుఁ బరిజనులకు
సతతముఁ బ్రగ్గడను జూపు చనదు ధరిత్రీ
పతి ప్రగ్గడయై ప్రగ్గడఁ
బ్రతిహస్తునిఁ జేయవలయు బద్దెనరేంద్రా. 14

క. అతిమహిమోన్నతియును సం
పతియును సత్యర్థమార్గభారనిమగ్న
స్థితియును దంత్రము మంత్రికిఁ
బతి యిచ్చుట నీతి గాదు బద్దెనరేంద్రా. 15

క. మానుగ భూపతి యుపశమ
హీనుఁ జెలిం జేసి మంత్ర మెఱిఁగించుట యీ
జ్ఞానము పతి పతితునకును
బానస మిచ్చినవిధంబు బద్దెనరేంద్రా. 16

క. వక్రిని బతి యన్యోపా
యక్రియలను జక్కఁజేయునది దానను ని
ర్వక్రంబు కాని తుద దహ
నక్రియ తథ్యంబు కీర్తినారాయణుఁడా. 17

క. కూర్పరుఁ బ్రజ విడుచు, నోడఁగ
నేరదు సౌమ్యునకుఁ గాన నృపతి ప్రజను సా
ధారణరూపంబున నయ
భారకుఁడై మెలఁపవలయు బద్దెనరేంద్రా. 18

క. పరశక్తియు నిజశక్తియుఁ
బరికింపక తొడరుటెల్ల భంగమునకుఁ బ
ట్టారులం దన్ను నెఱుంగుట
పరమజ్ఞానంబు పతికి బద్దినరేంద్రా. 19

క. *బలవర్గము సామంతుల
బలమున కగ్గలము గన నృపాలున కొప్పున్
బలిమి, పెరనృపతి కాజ్ఞా
బలసంపద యెంతదవ్వు బద్దినరేంద్రా. 20

క. స్ఫురితరుచిరత్నచామీ
కరవీజనధారణములు(1)గా వొప్పునకుం
బరివారము మెయిలక్ష్మియు
నరపతులకుఁ దొడవు కీర్తినారాయణుఁడా.

క. స్వాయత్తుఁ డుత్తముండు ప
రాయత్తుం డైన భూతలాధీశునకుఁ
స్వాయత్తుకన్న మేలుభ
యాయత్తుం డండ్రు దశదిశాభరణాంకా.

క. పరికింపనీతిమార్గము,
నరపతులకు నెల్ల బహుజనద్వేషముగాఁ
దొరకొనియెడిలాభంబులు
పరిహరణీయంబు లండ్రు బద్దినరేంద్రా.

(1) కారణములు. * తలవర్గము.

క. ఇది దేశం బిది కాలం
బిది న్యాయం బిది వ్యయంబు నిది సంపదనా
కిది శక్తి యనువిచారము
వదలమి మతి పతి కుదార వైరోచనుఁడా. 24

క. పదను దొరకొనుఁడుఁ జెచ్చెర
వదలక వెదవెట్టు హాలికవర్గముకరణిం
బదను దొరకొనుఁడుఁ జెచ్చెర
వదలక కార్యంబుఁ దీర్పవలయున్ బతికిన్. 25

క. భావగుణ మలిఁగి చెరుపఁగ
నోవుట, కరుణించి మనుపనోపుట, జడుఁడై
కోపప్రసాదగుణములు
చూపనిపతి పతియె? నన్నెచోడనరేంద్రా. 26

క. కోపప్రసాదములలోఁ
గోపము చూపుమఁ బ్రసాదగుణ మేయెడలన్
జూపనినృపతిం గొలిచిన
పాపమునకు మేర యెద్ది? బద్దినరేంద్రా! 27

క. తాను దయఁ బెద్దమవిచిన
మానిసిఁ బతి తగినయెడల మన్నింపమి య
జ్ఞానము తనమనువు గజ
స్నానం బగుమీఁదఁ గీర్తినారాయణుఁడా. 28

చ. నవసినవారి, బ్రిస్తవమునన్ మృతిఁ బొందినవారివారి, నా
హవముఖవీరులం, బనులయందు బ్రగల్భుల, వేరులేనిబాం
ధవుల, వివేకులం బుధులఁ, దప్పనికాపుల భక్తియుక్తులన్
ధ్రువముగఁ బ్రోవలేని నృపతుల్ కుపతుల్ పరపక్షభైరవా.

క.*తన కెక్కుడనుండియు ద
క్కని భృత్యుల మనిపి చెరుపఁగావలదు ప్రియో
జనమునకుఁ దగినమేలి
చ్చునది నరేశ్వరుఁడు నన్నచోడనరేంద్రా. 30

క. మనుపఁ గొఱయేని జీతము
తనియఁగ నిచ్చునది యెంతదయ గలిగియు నే
రనివాని నెఱతనమునకుఁ
జొనుపుట దుర్నయము నన్నచోడనరేంద్రా.

క. దోషములేకయు నలిగెడు
రోషాయత్తునకు నెవ్వరును వెఱతురు ని
ర్దోషక్రోధికిఁ బామున
కీషద్భేదంబుగలదె(1) యేమిట నైనన్. 31

ఉ. న్యాయముదప్పినా నృపతినాఁడు సమస్తముఁ బాడు, సజ్జనుల్
వాయుదు నూరువాడు, కులభామినిపాయుదు నిల్లువాడు, లేఁ
బ్రాయపురూపసంపదలు వాయుఁదు దేహము వాడు, ధర్మముల్
వాయుఁదు మూఁడులోకములుఁ బాడగు నన్ననగంధవారణా.

---

(1) కీషద్ద్వేషంబుగలదె; ద్వైషమ్యమున్నె. * కెక్కటినుండి.

ఉ. మండలనాథునాజ్ఞకు సమస్తజనంబులు నోడి పాడిమై
నుండక మేరఁదప్పి బలియుం డబలుఁ మననీక పెద్దమీ
నొ్కండెకమీను[మ్రింగుక్రియఁగ్రొవ్వునఁజంపుచునుండెనేనియ
మ్మండల మేల నిల్చు మతిమంతులకున్ బరపక్షభైరవా. 34

చ. వెరవరిగానివాని కడువేసరుచుండెడువాని, మాటలన్
సరసుఁడుగానివాని, మతిచాలనివానిని, లంచమిచ్చినన్
బొరసినవానిఁ, బోవునెడఁబ్రొద్దులువుచ్చినవాని, భీతునిన్,
బరుసనివాని, రాజు పనిపంపుటకీఁడు వివేకభూషణా. 35

క. నేరమి [దొడరినదిద్దఁగ
నేరకయుం]డెడి విరక్తనృపతిని గొలువం
దూరస్థులు గాకుండెడి
వారలు దుర్మ్మతు లుదారవైరోచనుఁడా. 36

. రాజుల నతిక్రమింపఁగ
భూజనులకు భయము పాడిబొరయకయుండన్
రాజులు వెఱతురు గావున
రాజులకుం బాడి రాజరాజమనోజా. 37

అలుగుచుఁ జెరుపఁగనయ్యెడు
కొలఁది విచారింప కెత్తికొని యొరులకుఁ దో
సలుగుట తన కలుగుట యా
యలుకయ సిధసంబు దశదిశాభరణాంకా. 38

ఉ. వారనియల్కఁజేసి బలవంతుఁడు (1)పైకొని విగ్రహించినన్
దూరముపోవుటొండె వినతుండయి వానినచొచ్చుటొండెఁగా
కీరసమెత్తి కోల్ మతివిహీనత నేనుఁగుతోడఁ దా పెనన్
బోరుట; నీతిమార్గ మిది భూనుత రాజమనోజభూభుజా. 39

క. ఎందును గార్యవిచారము
డెందము గలవాఁడె తీర్చు డెప్పరమైనన్
డెందము గలఁగదు గావున
బందకు మతివుట్టదండ్రు బద్ధినరేంద్రా. 40

క. ఆప్తు నవివేకి నొల్లర
నాప్తుని విద్వాంసు నొల్ల రార్యులు మంత్రి
వ్యాప్తికి మంత్రి వివేకియు
నాప్తుఁడుఁ గావలయు దశదిశాభరణాంకా. 41

క. ఆప్తు లెఱింగిన, నాప్తుల
యాప్తు లెఱుంగుదురు తత్తదాప్తశ్రవణ
ప్రాప్తమగుచుండుఁ గావున
నాప్తపరంపరను మంత్రమువియ్యున్ బతికిన్. 42

క. ఆద్యావస్థనె రిపులను
ఛేద్యుల జేయు(నది) తడవు సేయుటయు(2)నఖ
చ్ఛేద్యము ముదిరి కుఠార
చ్ఛేద్యం బగు(నండ్రు) రాజసిద్ధాంతవిదుల్. 43

(1) పైదను. (2) సిద్ధయాపియునఖ.

క. ఆయంబు వ్యయము నొడిచిన
శ్రీయగు, సమమైన దళము చెడకుండు, వ్యయం
బాయమును నొడిచెనేనియుఁ
బాయదు పేదఱిమి సార్వభౌమునికైనన్.

క. నోసితనవలన దండము
గాసిల్లినవానిఁ జెట్టఁగావగవక తా
నాసన్నవర్తిఁజేయుట
మోసము పతికండ్రు సిద్ధముగ బద్దినృపా.

క. సతికంటె నబల వసుమతి;
సతి పతి లేకున్నఁ జెడుట స్వల్పమె, ధాత్రీ
పతిలేనినాఁడు సద్య
శ్చ్యుతి వసుమతి కండ్రు నన్నచోడనరేంద్రా.

క. నాయకవిరహితమును బహు
నాయకముఖ్యమును బాలనాయకమును స్త్రీ
నాయకమై(1) చెడు సిరి నర
నాయకులకు నండ్రు కీర్తినారాయణుఁడా.

క. పరదోషకథామోదము
పరపీడోత్పాదనంబు బలిమిఁ బరస్త్రీ
హరణము సుఖముగ మనుపతి
పరమోత్పాతంబు ప్రజకు బద్దినరేంద్రా.

(1) నాయకమునఁ జెడు.

గద్య:- ఇది శ్రీలక్ష్మీవల్లభపాదపద్మారాధన
కమలాప్తకులపవిత్ర నన్ననగంధవారణ
రాజమనోజరాజాంక బద్దెనాఖ్య
ప్రణీతం బైన నీతిసారంబందు
రాజనీతిప్రకారం బన్నది
ద్వితీయాశ్వాసము. *

శ్రీ శ్రీ శ్రీ



* ప్రథమాశ్వాసము లేదు. పోయినది. తక్కిన రెండు ప్రకరణముల చివరను "ఆశ్వాసము" నకు బదులుగా "అధికారము" అనియున్నది. ప్రథమాధికారమునఁ గవివంశవర్ణనాదు లుండనోపును.

అవిఘ్నమస్తు.

శుభమస్తు.

# బద్దినీతులు.

సేవకనీతిప్రకరణము.

శ్రీశర్వీభూషిత(1)వి
ద్యాతిశయోన్నతుఁడ బద్దెనాఖ్యుఁడ బుధసం
ప్రీతమనస్కుఁడ సేవక
నీతులు వివరింతు సభ మనీషులు మెచ్చన్. 1

క. పనివినఁ గొలువవలయును
బనివినఁడే తనకుఁ దానఁ బనివినవలయున్
బనివిననినృపతిఁ గొల్చిన
మనుజుఁడు మనుజాధముండు మహిబద్దినృపా. 2

క. ధాత్రీకుటుంబకత్వజ
గత్రాణనిసర్గమతులు గావున శుద్ధ
క్షత్రియు లుండఁగ నొరుల న
పాత్రుల నమ్మరు రె బుధులు బద్దినరేంద్రా. 3

ఉ. అచ్చుగనాప్తుఁడయ్యుశుచియయ్యుమహాహితుడయ్యుఁబంచినన్
జెచ్చెరఁ గ్రచ్చఱఁగ పనిసేయఁగనోపియు విద్యగల్గియున్
మెచ్చఁగ నర్థమిచ్చియును మిక్కిలి బీరము గల్గియున్ భటుం
డిచ్చ మెఱుంగఁడేని పతి కేవయుగున్ జరపక్షభైరవా. 4

---

" (1) తిన్వినిభూసుత.

క. పతి కలిగి తానె పొలియును
పతి నలిగించియును దానె భంగమునొందన్
బతి మతమె కాని భటునకుఁ
బతితో నాగ్రహము చనదు బద్దినరేంద్రా. 5

క. పతి యిమ్మెకాని భృత్య
ప్రతతికిఁ దనయిమ్మచనదు పరుసనికార్య
స్థితి యిమ్మెకాని భూతల
పతికిన్ దనయిమ్మ సనదు బద్దినరేంద్రా. 6

క. నరపతి ప్రస్తవమునఁ దన
(1)పరిభవమునఁ దక్కనొందుపట్లను సేవా
పరులకు నిజాత్మరక్షా
పరతయ రమణీయమండ్రు బద్దినరేంద్రా. 7

క. ఆలిని భృత్యునిఁ దగ దయ
నేలినపతి పెద్దయ(గును); నేర్పఱి(యింటన్) (2)
మాలుదు రతడొల్లనినాఁ
డాలూర్వశియైన భృత్యుఁ డర్జునుఁడైనన్. 8

చ. అఱమరలేక చెడ్డరొడ నక్కఱవీఱ్చినయట్టిచుట్టమున్
తఱిఁ దగనీనిచోట నుపతాపముసేయక కూడుకోమలిన్
నెఱయఁ గ్రమక్రమంబెఱిఁగి నెయ్యముఁజేసినయట్టిభూపతిన్
మఱతురె కోటిజన్మముల మానగుణోన్నత బద్దిభూపతీ. 9

---

(1) పరిరంభము. (2) నేర్పరికంటెన్.

క. దొరతనము వలయు నొందెను(1)
సిరివడయఁగ వలయు నృపతిచే భృత్యునకున్
(2)దొరతనము సిరియు వెలిగా
నరపతి తలమొఱుక మంత్రి నయతత్త్వనిధీ. 10

క. కెలనము సేసియు నవసియుఁ
గొలిచినఁ గొదవట్లయేనిఁ గువలయ(పతిదా)
కొలువేల యుత్తరోత్తర
ఫలసారమె రాజసేవ బద్దినరేంద్రా. 11

ఉ. జీవితమీఁదు, మానఁగడవఁ జేసినవృత్తిఁ గ్రమక్రమంబునన్
బోవఁగఁజూచుఁ, దేజమునఁబుట్టెడులాభము దప్పఁజేయు,(4) స
ద్భావము బొంకుగాఁ దలఁచుఁ, బాయక నేరమె రోయుఁగావునన్
సేవకులన్ విరక్తనృపుసేవ విపజ్జలరాశిముంపదే. 12

క. సతియును బతియును జెలియును
వితథంబుగఁ బలికి రేని విడువఁగవలయున్
సతియుఁ దిలోత్తమయైనను
బతి యిందుఁడైనఁ జెలియుఁ బ్రాణంబైనన్. 13

చ. వెడమతియై యుదారగుణవీరగుణంబులు బీజమాత్రమే
ర్పడినను నీగిపోటుఁ గలపందగు, దానగుణంబు లోభికిన్,
బాడవఁగ నోడుభీతునకు బుద్ధిగ నెవ్వఁడు చెప్పుచుండఁగాఁ(5)
దొడరినమంత్రి తాన పగతుండగు నన్నగంధవారణా. 14

(1) దొరవడయవలయు నొందెను. (2) దొరయును. (3) పతులన్ గొలచేల.
(4) దప్ప X X; దవ్వుసేయు. (5) బుద్ధిగ నెప్పును నొప్పదుండఁగా.

క. ధనమున బలిమిని మదమున
జనపతి తమ్ములఁ దదాప్తజనముల నెడఁగా
మనుమండెడు ప్రగ్గడకును
మును మెలఁగిన మెలకువకును ముప్పగుఁ బదపా. 15

క. నరపతిలక్ష్మీవిద్యా
పరిణతి, చతురులకు వీరభటులకు సేవా
పరులకుఁ దక్కఁగఁ దక్కె
వ్వరికి నగోచర ముదారవైరోచనుఁడా. 16

క. చేరి తన చెలులుఁ జుట్టలుఁ
గోరి యభీష్టములు వంచికుడువనిసిరి ని
స్సారము నిరర్థకంబు వి
*చారింపఁగ నెపుడు దశదిశాభరణాంకా. 17

క. తలవెండ్రుకలందఱుచు
ట్టలుఁ దోఁతురు లక్ష్మిఁదోఁచుటయుఁ బాయుదుఁ; దోఁ
బలుకరుగావున లక్ష్మీ
లలనయు చుట్టంబు మనుజులకు బద్దినృపా. 18

చ. సిరిగల(చోటమేనఁ దనజీవముఁగల్గినచోటఁ గాలముల్)
దిరుగనిచోటఁ దేజమెడఁద్రొవ్వనిచోటను దుః‡ఖసంఘముల్
పొరయనియట్టిచోటఁ దగఁ బుద్ధి దలంచి పరోపకారముల్
తిరముగఁ జేసికాక యవితీఱినఁ జేయను ధాతశక్యమే. 19

* పరికింపఁగ. ‡ దగ్ధసంఘముల్.

ఉ. దానగుణంబ యెన్నఁగఁ బ్రధానగుణంబది మున్న గల్గినన్
గాని విశిష్టమై పురుషకారము నిల్వదు లోభి[నాఁగఁ ద
న్నేసి]యశంబు[సత్త్వముసహిష్ణుతయున్ విభవంబువిద్యయున్
మానము బీరమున్ దనువు మన్ననయున్] వృథ బద్దిభూపతీ.

క. తగఁ బ్రోచువాఁడె జనకుఁడు
తెగఁబల్కినవాఁడె వెఱ్ఱి ధీరుండై యి
మ్ముగ మనుచువాఁడె చుట్టము
జగమున నరులకు వివేకచతురాననుఁడా. 21

చ. ధరణిపుఁ డాజ్ఞచే నరుఁడు దైవముచే దయివంబు మర్త్యుచే
సురతము ప్రౌఢచేఁ బలుకు సూనృతిచేఁ గులమాత్మవేదిచేఁ
బరు లుపకారిచేఁ గలిమి బంధులచే దార ధర్మబుద్ధిచేఁ
బురుషుఁడు తాల్మిచే మహిమ పుణ్యముచే వెలయున్ యశోనిధీ.

ఉ. చేతులు వత్సరూపమునఁ జేకొనఁ జేసి యభీష్టవస్తుసం
ఘాతము లెప్పుడున్ గురియు కామదుఘత్వశుభప్రసిద్ధి ధా
త్రీతలధేనువుండఁ దగ తీఱమి కన్యల నాశ్రయించి తృ
ష్ణాతురులైనఁ జొప్పడునె యర్థము రాజమనోజభూభుజా. 23

గద్య:—ఇది శ్రీలక్ష్మీవల్లభపాదపద్మారాధన కమలాప్త
కులపవిత్ర నన్నగంధవారణ రాజమనోజరా
జాంక బద్దెనాఖ్యప్రణీతంబైన [నీతిసారంబు
నందు] సేవకనీతిప్రకారం బన్నది తృతీ
యాధికారము.

అవిఘ్నమస్తు.

శుభమస్తు.

# బద్దినీతులు.

## లోకనీతిప్రకరణము.

క. భానుకులదీపకుండను
భూనుతవిక్రముఁడ బద్దిభూపతిఁ గవిస
న్మానితుఁడ లోకనీతులు
నేనర్థినొనర్తు నధికనిపుణత్వమునన్. 1

క. ఆపద్వినీతులగుదురు
కాపురుషులు పరమపురుషకారగుణుల్ శ్రీ
ప్రాపింపవినీతులగుదు
రాపద్దశకంటె దశదిశాభరణాంకా. 2

చ. పిసిడియ కష్టుఁ, డాజిముఖభీతుఁడెబోతు, కృతఘ్నవృత్తికిన్
విసువనివాఁడెమాలఁ, డవివేకియచీకు, శఠుండ (1)(దొంగ,)దు
ర్వ్యసనియకాతరుం, డనృతవాదియె(2)కట్టిడి, మూర్ఖచిచ్చు, ఛాం
దసుఁడె మృగంబు, కొండియుఁడె ద్రోయ, దరిద్రుఁడె వేదు
(3) [రెయ్యెడన్. 3

క. స్థిరమతియనఁగా భువిజను
పురుషునినమ్మనది పెక్కుబుద్ధులమైనా
సరవెల్లిపోడలునూపెడి
(4)నరుపోరుగేమిటికిఁ గీర్తినారాయణుఁడా. 4

(1) సోమరివ్యసనియు. (2) కల్లరి. (3) రయ్యెడన్. (4) నరుపోరువేమిటఁ.

క. బలిమికిఁ బాడి తపంబున
కలుగమి, సిరి(1)కోర్పు, విద్యకభిమానము, వా
గ్బలమునకు బొంకువారయమి,
కులమున కాచారమొప్పుఁ గొమరురభీమా. 5

క. హీనునకును బలిమి, పరా
ధీనునకు సుఖంబు, దుర్మతికి రిపుజయు, మ
జ్ఞానికి బరమును, (2)నలిగెడు
వానికి సైరణ యసంభవము బద్దినృపా. 9

క. అలుకయ పగ, సౌజన్యమె
చెలి, (3)మానయ కష్ట, (4)ముప్ప సెగ్గము, విద్యా
(5)బల మేశీలము, (6)రాజ్యము
(ఫలమాజ్ఞయ) యండ్రు (బుధులు) బద్దినరేంద్రా. 7

చ. కులముకుపుత్రుచేఁ, జెలిమికూర్పమిచేఁ,దనయుండుముద్దుచేఁ,
బలుకనృతంబుచే, (7)బిడెముపానముచే,మునిసంగమంబుచే,
వలనుప్రతిజ్ఞచే, దొరవివాదముచే, (8)గుణమొప్పు లేమిచేఁ,
గలిమిమదంబుచేఁ, మది వికారముచేఁ, జెడు బద్దిభూపతీ. 8

క. కులమాచారమె చెప్పును
గలిమి శరీరంబె చెప్పుఁ గలవిద్యలు దాఁ
బలుకుబడి చెప్పుఁ గూరిమి
కోలఁదులు కూటంబె చెప్పుఁ గొమరురభీమా.

---

(1) కొప్పు. (2) కొలిచినవానికి. (3) మానుట. (4) ముప్ప. (5) బలమయు. (6) రాజ్ఞా. (7) సెలఁత. (8) మొప్ప.

క. జూదము, సహాగృవాసము,
వాదము, కరిసనముపొత్తు, వడ్డియు, దొడరన్
గాదమలోననువిరసో
త్పాదనకారణములండ్రు బద్దెనరేంద్రా. 10

ఉ. వట్టము లంచముఁ గువయు వైద్యముజోస్యమునొజ్జకూలియున్
జట్టియుబొట్టకూలియును (1)జాగము భోగముపన్ని దంబు(2)చే
పట్టుటయున్ (3)గవిత్వమును పన్నును సుంకము నాడిఁగోలు నే
పట్టునఁగోలుపోయి తరివాసినఁ జేరదు బద్దెభూపతీ. 11

క. పరిభవము దొడరు నెడలను
సురతమునన్ దక్కు నెల్లచోఁ బురుషున కా
భరణము సైరణ, సతికా
భరణము లజ్జాగుణంబు బద్దెనరేంద్రా. 12

క. దొరలేనివానివిద్యయు
దరిద్రుమహిమయును మూర్ఖుతపమును పాడిన్
బొరయనిరాజ్యము మిగులన్
బరికింప నిరర్థకములు బద్దెనరేంద్రా. 13

క. ఒరుని ల్లరిగెడుకాంతకు
వరవున కనురక్తయైన వనితకు విషయా
తురలై (4)క్రుమ్మరు సతులకుఁ
బరిభవములు వచ్చునండ్రు బద్దెనరేంద్రా. 14

---

(1) సాగము. (2) చేపట్టలమున్. (3) కవీంద్రులును. (4) క్రిమ్మరు.

క. సందియము లేమి వార్తలకు
నందము; పురుషానుకూల యగుట కులస్త్రీ
కందము, మగవానికి నిజ
మందము, మరియాద పతికి నందం బెందున్. 15

ఉ. సున్నము లేని వీడ్యమును జూడఁగ రంజన లేని వేశ్యయున్
వెన్నెల లేని రాత్రియును వేదము శాస్త్రము లేని విప్రుఁడున్
జన్నులు లేని జవ్వనము చంద మెఱుంగఁగ లేని కావ్యమున్
మన్నన లేని రాజ్యమును మానుగ నొప్పదు బద్దిభూపతీ. 16

క. నీరికి రుచి శైత్యంబా
హారమునకు వేఁడి రుచియు సంగజకేళిన్
దారుచి యనుకూలస్త్రీ
సారంబగు చెలిమిరుచి రసజ్ఞులకెల్లన్. 17

ఉ. తక్కువ పేదవాని తగుదానము దానము, (1) పెద్దదారిలో
నెక్కటిబూని యగ్గలిక నేగు చలంబు చలంబు, పోరిలోఁ
బెక్కువిధంబులం బొడుచు బీరము బీరము, రాత్రియేకతం
బొక్కని యాలుపైఁబడిన నొల్లనిశౌచము శౌచ(2)ముర్వరన్.

క. నృపదార నిరీక్షణమును
నృపదాసీ సంగమంబు నృపనయవిద్యా
నిపుణు లాడంబడ, రెన్నఁడు
నపయశములు గాన దశదిశాభరణాంకా. 19

(1) పెద్దవారిలో. (2) పర్వను.

ఉ. ఒరుసతితోడి కూటమియు నుత్తముతోడి విరోధముం మహా
సరపతితోడి హాస్యమును నాగముపై శయనించి నిద్రయుం
గురుల కవజ్ఞగాఁ బలుకు క్రూరుల నాప్తులఁ (1) జేసికొంటయుం
మరణము (2) దెచ్చు శీఘ్రగతి మానగుణోన్నత బుద్ధిభూపతీ.

చ. పలువురతోడి విగ్రహము బాంధవవర్గముతోడి గర్వముం
గులసతితోడి పోరు కడుక్రూరునితోడి సఖిత్వముం మహా
(3) బలయుతుతోడి రాపు పరభామలతోడి రహస్యభాషలుం
దలఁపఁగ హానికార్యములు తప్పవు సన్నుతగంధవారణా. 21

క. రిపుపొత్తు పాముపొత్తును
గపటుండగు విప్రుపొత్తు గడుసరిపొత్తుం
విపరీతభార్యపొత్తును
నెపమునఁ దా విడువకున్న నేరము వచ్చుం. 22

క. కడఁగి యగోచరవస్తువు
వడయుదునని కడుఁ బ్రయాస పడఁ దొడఁగి జడుం
డెడపని మనోనువేదనఁ
బడు గీడ్పడు బేలనాఁగఁ బడు నిడుమఁ బడుం. 23

ఉ. ఏనుఁగు దోమఁ జేయు, గుణహీను గుణోన్నతుఁ జేయు, సింహముం
బూని యజంబు సేయు, మగపొల్ల బరాక్రమశాలిఁ జేయు, స
న్మానుని హీనుఁ జేయుఁ గడు మందునిఁ జాలవివేకిఁ జేయుఁ, దాఁ
గాన ధరిత్రి దైవమును గాదనరాదు వివేకభూషణా. 24

(1) జేయువారికిన్. (2) వచ్చు. (3) బలియుని.

క. చెడినట్లయుండి మనుదురు
చెడని తెఱంగుననునుండి చెడుదురు మనుజుల్
చెడితినని (1)వగను జెడనని
(2)కడువీగును జెందఁ జెఱుకగల మనుజుఁ డిలన్. 25

క. ఒనరఁ బురాకృతఫలమున
కనురూపము చిత్తవృత్తి యగుటను కర్మం
బనుసూది పిఱుఁద దారై
చనుమతి, దనవశముగాదు సర్వజ్ఞునకున్. 26

క. ఎట్టిది పురుషుపురాకృత
మట్టిదమతి సంభవించు నట్టిర చెలులున్
జుట్టలు నగుదురు కర్జం
బట్టిదవర్తిల్లు కడఁక యట్టిదపుట్టున్. 27

చ. కరిసన మొప్పఁ జేసి కడకన్ నృపుఁ గొల్చిన జూదమాడినన్
దరిసిన(3)విల్లుదోసి పరదేశముఁ బోయిన విద్యగల్గినన్
సిరి దనపూర్వజన్మమునఁ జేసినయంతియకాక కల్గునే
పొరలిన మిట్టిపడ్డఁ దలపోఁతలువోసిన వెచ్చనూర్చినన్. 28

క. దుష్టజన (4)నిగ్రహంబును
శిష్టపరిపాలనంబుఁ జేసినపతికిన్
దృష్టము (5)గానఁగఁబడదా
దృష్టము సాధింప నొందు (6)దీక్ష లవేలా? 29

---

(1) వగవ. (2) విజ్ఞనుపీఁగడె. (3) ధాత్రి. (4) నిగ్రహంబు. (5) గానగుమతియదృష్టము. (6) దీక్షలదేవా.

వేదముకంటె విద్య మురవిద్విషుకంటెను వేఱదైవముఁ
జాదులుకంటెఁ బువ్వులును జాహ్నవికంటెనుబుణ్యతీర్థముఁ
సోదరుకంటెఁ జుట్టమును జూదరికంటెను బాపకర్ముఁడుఁ
లేదనుకంటెఁ (1)పాపమును లేదు మహిన్ బరపక్షభైరవా.30|

క. శ్రీవిభుఁ డైనబద్దెవిభు చేసిన (2)నిస్తులనీతిసార ము
క్తావళి శిష్టలోకహృదయప్రియమై యలరారుఁగాత యిం
దీవరగర్భుఁడున్ హరియుఁ దేజమెలర్పఁగఁ జంద్రసూర్యులున్
దేవగణంబులున్ బుధులు దిక్పతులున్ గలయంతకాలమున్.

క. ఖ్యాతిగ బద్దెన చెప్పిన
నీతియ కడునొప్పు సకలనీతులలోనన్
భాతియొనర్చుచు భువిలోఁ
బూతనుబుద్ధియు యశంబుఁ బుణ్యము (3)నిచ్చున్.

గద్య:-ఇది శ్రీలక్ష్మీవల్లభపాదపద్మారాధన కమ
లాప్తకులపవిత్ర నన్నసగంధవారణ రా
జమనోజరాజాంక బద్దెనాఖ్యప్రణీతంబైన (4)నీతిసారంబందు
లోకనీతిప్రకారం బన్నది
చతుర్థాధికారము.

(1) దాపమును. (2) నిధుల. (3) గల్గున్. (4) నీతిసాగరంబ.